శ్రీ నీలకంఠ శివాచార్యప్రోక్త బ్రహ్మసూత్ర భాష్యానువాదము నామోదించి బహుమానము నొసగిన వదాన్యవతంసులు—

శ్రీయుతులు "అరుగుల" గంగాధరశ్రేష్ఠిగారు

కమల్ "బీడీ" కార్యాలయము, నిర్మల.

(ఆదిలాబాదుజిల్లా)

శ్రీ సర్వమంగళా గ్రంథమాల - ద్వితీయ పుష్పము.

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శ్రీ శాంకరీయ

# బ్రహ్మమీమాంసాసూత్రభాష్యము

| ఆంధ్రీకరణము |

## చతుఃసూత్రి - ప్రథమ సంపుటము




అనువాదకులు :

[illegible]

బ్ర॥ శ్రీ॥ సర్మల రామనాథారాధ్యులవారి ద్వితీయ పుత్రులు,

సుప్రసిద్ధులగు శ్రీ సర్మల అంబయ్య సిద్ధాంతిగారి యనుజులు.

బ్ర॥ శ్రీ॥ కొడిమెల భోగసోమలింగారాధ్యులవారిచే శాంభవదీక్షితులు.

బ్ర॥ వే॥ సకలశాస్త్రపారీణ ఆత్రేయ లక్ష్మణశాస్త్రిగారి సచ్ఛాత్రులు నగు

సర్మల శంకరశాస్త్రిగారు


★


ప్రతులు 500 ] (1960) శార్వరి సం॥ [ వెల రూ. 5.00

# గ్రంథమాలానామకరణోద్దేశము

ఈ గ్రంథమాలను చి. నాయనుఁగు కూతురు యొక్కయు శ్రీవారి ధర్మపత్ని యొక్కయు నామధేయంబగు "సర్వమంగళ" యను పదముతో నెలకొలిపి యీ నీలకంఠ భాష్యపు చతుఃసూత్రిని ద్వితీయ పుష్పముగా ప్రకటించితిని.

పార్థివ లింగస్తోత్రమును రచించి వికారి సం॥ మహాశివరాత్రి ప్రయుక్తమహారుద్రయాగ సందర్భమున ప్రథమపుష్పముగా ముద్రింపఁ జేశినవాఁడను.

ఏతత్పూర్వము మదనుజపుత్రుని యొక్కయు శ్రీమదాచార్యుల వారి యొక్కయు నామధేయమొక్కటియేయగుటఁజేసి - శ్రీకంఠీయ గ్రంథమాల— యను పేరుతో ప్రథమ ద్వితీయ తృతీయ బిల్వములను వెలయించి ఇష్ట ప్రాణ భావ లింగములకు అంకితములుగా సమర్పించ నైనది.

అంతకుమునుపు శైవచింతామణీ గ్రంథమాలానుబంధములుగా స్వకీయ జ్యోతిర్ముద్రణాలయమందు నెనిమిది పొత్తములు ప్రచురింపఁ జేయఁబడినవి.

ఇట్లు సర్వాంతర్యామియగు పరమేశ్వరుని వాఙ్మయముతో సేవించి విజ్ఞానుల నారాధించియు స్వజనుః సార్థకతను ప్రారబ్ధసంకట నివృత్తి నపేక్షించుచు శ్రీ రాజరాజేశ్వరప్రీతిఁ బ్రార్థించువాఁడను.

ఇట్లు
గ్రంథకర్త

★

శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాం నమః

## ముందుమాట

శ్రీ నీలకంఠ శివాచార్యులం గుఱించియు సత్కృత భాష్యము నుద్దేశించియు ప్రముఖుల యభిప్రాయములు వివిధములుగా నున్నందున "ఇదమిత్థ" మని వ్రాయుట కవకాశము కలుగుచున్నయది.

మద్విరచిత వైదికమత సామరస్యమున "శ్రీ నీలకంఠ భగవత్పాదులు గౌతమ గోత్రికు" లని శివాంకము ననుసరించి వ్రాసితిని.

భారద్వాజ గోత్రికులు ప్రాయశః కృష్ణానదీ ప్రాంతమందు నివసించువారుగాను, గౌతమ గోత్రికు లధికముగా నైజాంరాష్ట్రమం దుండువారుగాను గానంబడుచున్నందున నైజామునందు చేరిన కాళేశ్వరము, శ్రీ నీలకంఠ శివాచార్యులవారి జన్మస్థాన మగుటవలనను శ్రీమదాచార్యులవారు గౌతమ గోత్రికులని విశ్వసించవలసి యున్నది.

ద్వాదశారాధ్యులలోని యాచార్యత్రయములో చేరిన శ్రీ నీలకంఠాచార్యులు గౌతమగోత్రికు లని నొక్కివక్కాణించుటకు కాళేశ్వరస్థలము, శివాంకగ్రంథము అను నిదర్శనములు ప్రబలము లగునని.

గౌతమమహర్షి మహాశివభక్తుండని "ఉపమన్యు దధీచి గౌతమ" అను నానుడి తెలుపునది; ఇట్టి గొప్పవ్యక్తి మూలముగాగల వంశమునందు భాష్యకర్త కాదగిన శ్రీ నీలకంఠ శివాచార్యు లవతరించుట "గోపకుల సంజాతుండైన శ్రీకరుం డనంబడు శివభక్తుని వంశములో మహావిష్ణువు శ్రీకృష్ణుడై యావిర్భవించుట" వలె పొసగుచున్నయది.

ఋషుల చరిత్రలను విమర్శించి వారికి కళంకము నాపాదింప నుద్దేశించు నెడల ప్రతి ఋషికి నిట్టి సువిమర్శయే సంబంధించును కావున, ఋషుల సామర్థ్యమును మాత్రము స్వీకరించి వారి చరిత్రములలో నుండు నసంగతము లను పాటింపరాదని మన పెద్దలు నిర్ణయించిరి.

ఇందువలన నీలకంఠాభిధానుండైన భాష్యకర్త మహాత్ముడు గౌతమ గోత్రికుండనియు తదితరులలో చేరని నీలకంఠశబ్దవాచ్యులు భారద్వాజ గోత్రికులు కావచ్చుననియు విశదమగునట.

### నీలకంఠోదంతము

శ్రీ నీలకంఠాచార్య శివయోగీంద్రులు గౌరీశ్వరార్యు లనంబడు మాహేశ్వరదంపతులకు శ్రీ కాళేశ్వరానుగ్రహమున వరపుత్రులుగా జన్మిం

చిరి. "నీలకంఠుఁడు భాష్యకర్త కాగలడనియు శైవమతప్రచారముఁ గావించి జగద్గురుపదవి నలంకరించుననియు శంకరుఁడు విశ్వేశ్వరునకు వర మొసగెను.

స్వభాను సంవత్సర చైత్రశుద్ధ దశమిని శుభగ్రహవిశిష్ట పుష్యర్క్షము నందు సోమవారమున గౌరీదేవియం దుద్భవించిన నీలకంఠుఁడు శుక్లపక్ష చంద్రునివలె దినదినప్రవర్ధమానుఁడై విద్య నభ్యసించుచుండగా బోధాయన మహర్షి కాశేశ్వరమున కేతెంచెను.

బోధాయనుఁడు సుఖాసీనుఁడై నీలకంఠారాధ్య జన్మవృత్తాంతమును దిగువవిధముగా వక్కాణించెను.

విశ్వేశ్వరా ! సావధానుఁడవై వినుము.

పూర్వము కైలాసమందు హిరణ్యమంటపమున దేవగణసమేతంబుగా పార్వతీ పరమేశ్వరులు రత్నఖచితేంద్ర నీలమణిమయ పీఠమం దధిష్ఠించి యుండుతఱి మహావిష్ణువు "మహేశ్వరా ! ప్రపంచమున నానాటికి తగ్గుచున్న శివభక్తి నుద్ధరింప వ్యాససూత్రముల యథార్థమును గ్రహించు విద్వాంసు లఱుదైనవారు. గురుతెఱిగియు విశదీకరింపకున్నవారు గాన నొకానొక మహాపురుషుని యిక్కార్యమునకు నియోగించుఁ" డని ప్రార్థించెను.

అంత మహాదేవుఁడు "నారాయణా ? సర్వంబు విదితమయ్యెను. విఘ నుఁడు బాదరి యనఁబడువారు తమ మతప్రచారార్థము నావలన వరముఁ బొంది విస్తృతప్రచారమును గావించిరి. అట్టి వరముల యవసానసమయ మాసన్నమైనది. కావున మాయామోహితులగువారి యవివేకమును పోగొట్టి సన్మతము నుపపాదించుటకు త్వరలో నీలలోహితరుద్రు నాజ్ఞాపింతు" నని యాదేశించి తద్విధము నెరవేర్చినవారు.

ఇది యంతయు దివ్యదృష్టితో కనుగొంటిననియు నీలలోహితరుద్రుఁడే నీ కుమారుఁడుఁగా నవతరించెననియు బోధాయనుఁడు వాక్రుచ్చి తోడనే వారిని వారాణసికి గొంపోయి నీలకంఠుని శ్వేతాచార్య సన్నిధిఁ జేర్చెను.

శ్వేతాచార్యులు నీలకంఠున కుపనయన సంస్కారమును గావించి శాంభవదీక్ష నొసగియు సర్వదర్శనపటులం దసాధారణ పండితు నొనర్చిరి. మరియు అఘోరవిద్య నుపదేశించి "గృహస్థుడవై శివాద్వైతప్రచారము గావింపు" మని యాజ్ఞాపించిరి.

పిమ్మట గౌరీవిశ్వేశ్వరులు కాశేశ్వరమునకు నీలకంఠునితోఁగూడ

నేతెంచి హారితగోత్రోద్భవుండైన వీరభద్రారాధ్యుల కుమార్తెయగు సర్వ మంగళతో వివాహమును గావించినవారైరి.

తత్సమయమునందే కుబేరాంశతో కాళేశ్వరవరసంజాతుండగు విక్రమాంక మహీపాలుఁడు శ్రీ నీలకంఠారాధ్యులవారి యసమాను పాండిత్య వైభవము నాకర్ణించి వారికి కాంచనభూషణాంబరాది వస్తుసమర్పణ పురస్సరముగా విధేయుఁడయ్యెను.

ఇట్టి యపూర్వ సామర్థ్యముగల నీలకంఠారాధ్యులవారి సన్నిధిని భాష్యాంతము పఠించిన శిష్యులలో దాక్షిణాత్యుడైన నాగదత్తుఁడు, ప్రతీచ్యుడైన సోమశేఖరుఁడు, ఉదీచ్యుఁడగు భవదేవుఁడు, ప్రాచ్యుఁడగు భీమేశ్వరుఁడును ప్రఖ్యాతిఁబడసినవారు. మరియు వీరు నలుగురు స్వగురు విరచిత ప్రస్థానత్రయమును నలుదిశలందు ప్రచారముఁ గావించినవారు.

శ్రీ నీలకంఠారాధ్యులకు సర్వమంగళాదేవియందు సోమేశ్వరుఁడు, అఘోరనాథుఁడు, కాళేశ్వరుఁడు, శ్రీగిరీశ్వరుఁడు అనఁబడు పుత్రులు జన్మించినవారు.

అంత శ్రీవారు జైన బౌద్ధ చార్వాకాది మతములను ఖండించి స్వమత సిద్ధాంతమును బలపఱచుచు కాశీక్షేత్రమందు ప్రవేశించిరి. అట గొప్పపండితుల సభలందు పూర్వపక్షములను నిరాకరించి "శివుఁ డొకఁడే ఆరాధ్యదైవము. శివాద్వైతమే సమంజసం" బని ప్రతిపాదించుచుండగా శ్రీవారి ప్రవచనమే శ్రుతిసూత్రాది ప్రమాణప్రసిద్ధంబనునట్లు విశ్వేశ్వరాలయమందు గొప్పగంట ప్రణవనాదముఁ జేయుచుండెడిది.

అట్టితఱి కాశిపండితులు - భాష్యము లన్నిటిని దేవిసన్నిధి నుంచవలెను. ఎద్దాని దేవి తన శిరముం దిడుకొనునో నయ్యది సర్వజనాంగీకృతంబగుగాక - యని సర్వభాష్యములను దేవిపాద సమీపమునందునిచి మఱునాఁటి ప్రాతఃకాలము కాగానే దేవిమందిర ద్వారమును తెఱవగా శ్రీ నీలకంఠభాష్యమే దేవి శిరముపై నున్నట్లు గాంచి "సర్వప్రామాణిక జనసమ్మతంబగునది యిట్టిదియే" యని యంగీకరించినవారైరి.

ఇత్యాది సందర్భములచే శ్రీ నీలకంఠాచార్యులవారద్వితీయ జగద్గురు పదవి నధిష్ఠించిరనియు తత్కృతభాష్యము సర్వథా సమాదరణీయంబనియు తేటపడుచున్నయది.

ఇఁక అనువాద విషయము.

ఇట్టి యనుపమ భాష్యము దురవగాహ మగుటఁజేసి శ్రీ శివయోగి, మహోపాధ్యాయ, ముదిగొండ నాగలింగశాస్త్రిగారు శివచింతామణిప్రభ యనఁబడు సంస్కృతవ్యాఖ్యానమును వ్రాసి శైవకోవిదులకు భాష్యార్థమును విశదపఱచినవారు. ఇట్టి శివచింతామణిప్రభయు శైవులందరికి తెలియకుండుట ననువాద మెంతేని యవసరమైనది.

నేనేమో అభిజ్ఞుడ నని భావించి సూత్రభాష్యము ననువదించుమని శ్రీ లోకారాధ్యులైన ఘట్టుపల్లి నాగమల్లయారాధ్యులవారు తదితర శైవ ప్రముఖులును ప్రేరేపించినందున నిట్టి యనువాదమునకు కడంగితిని.

ఇట్టతఱి కొందరు నా యనువాదమును గూర్చి తమ యసహనము నాచ్ఛాదించి శుష్కప్రియములను వక్కాణింపఁజొచ్చిరి. ఇఁక కొందరు తమ తర్కవాగ్ధాటితో వ్యాకరణాది శృంఖలములతోడను నన్ను విపశునిఁ జేయఁ జూచిరి. మరికొందరు అనావశ్యక భాషా నిర్బంధముల న్యూనతను కనఁ బఱచుచు కళవళపడఁజేసినవారు.

"శ్రేయాంసి బహువిఘ్నాని" అను నార్యోక్తి నాయందు సఫలమయ్యె గదా యని మది గుందుచు శివానుగ్రహము నభ్యర్థించి యీ విధము ముద్రణ కియ్యకొన్నవాడను. మరియు సహృదయు లెవరో వారినే యీ పొత్తముఁ జదివి యభినందింపఁ బ్రార్థించువాడను.

షడ్దర్శనపారీణులగు బ్రహ్మశ్రీమదాత్రేయ లక్ష్మణశాస్త్రులఁగారిచెంత వోరుగల్లుపురసీమ శ్రీ పణికెల రామలింగేశ్వర సన్నిధిని శ్రీ శైవమహాపీఠాధిపతి పీ రేశలింగశాస్త్రిగారి ప్రోత్సాహముతో శ్రీయుత రామిణి రాజమౌళి శ్రేష్ఠిగారి ఆశ్రయమున భాష్యాధ్యయనమును గావించితిని.

శైవులలో పరస్పర సహకారము లేనందున సంఘ ప్రముఖులు స్వవైభవాస్వాదలోలు రగుటవలనను మతాచార ప్రవర్తనాభిరుచి పదుగురి ఎదుట మాత్రము గానంబడుచున్నందునను "కలౌ శైవ మరోచకమ్" అను వచనము సార్థక మగుచున్నయది.

"సంఘే శక్తిః కలౌ యుగే" వ్యక్తిగత దోషములను పాటింపక గుణగ్రాహులమై ప్రతి యభ్యుదయ కార్యమునకు దోహద మొసగుచుందు మేని మన సంఘము పురోఽభివృద్ధిఁ గాంచగలదు. మన పూర్వికులు మాహేశ్వర శక్తితో సంఘశక్తి నినుమడింపఁ జేసినవారైరి. ప్రస్తుత సభలు, సమావేశములు, తీర్మానములు, సన్మానములు, సత్కార్యములు అను తెఱచాటున స్వార్థము తాండవించుచున్నది.

నారికేళ సమాకారా దృశ్యంతే౽పిహి సజ్జనాః
అన్యే బదరికాకారా బహిరేవ మనోరమాః.

ఇతర సంఘములు బదరీఫలముల వలె పై మెరుగుతో కనఁబడునవి. మన సంఘమైతేనో పదే పదే గౌరవము నపేక్షించుచు స్వాంతరమును కను గొనఁజాలకున్నది. తథాపి శమదమాది సంపన్నులగు శైవ మహాజనులు సర్వ మత సామరస్యమును స్వమతమునందు చూపెట్టుచు స్వాచరణతో మతాభి వృద్ధిఁ జేయుచున్నవారు.

సర్వమతములవారికి సాధనచతుష్టయ ముపేక్షితంబు గదా! భగవ త్స్వరూపము, ఉపాసనా భేదము మొదలగు విశేషములే సంప్రదాయముల నేర్పఱచునవి.

ఈ యాంధ్రీకరణమును యథామతి గావించినవాఁడను. వర్తైక శాస్త్రాభి నివేశము గల పండితుల సునిశిత విమర్శలకు, శ్రీ నీలకంఠీయ నాగలింగీయ వ్యతిరిక్తములగు స్వకీయుల పరిశోధనలకును, విమతస్థుల ఛలోక్తులకును, స్వసర్వజ్ఞతాభినివేశముతో మహనీయుల వ్రాతలను తిరస్కరించు స్వతంత్ర వాక్యములకును, ప్రమాణబుద్ధి గలిగియు వ్యక్తిగత స్పర్ధచే చేయఁబడు ఆర్భాటమునకును, దూర ముండువాఁడనై శ్రీ రాజరాజేశ్వరుని ప్రీత్యర్థము, సంస్కృత వాఙ్మయమును మాతృభాషయం దనువదించుట నభినందించు ఆంధ్రసహృదయుల సమాధానమునకై, శివాద్వైత వేదాంతాంశములను తెలుగునందు తెలియగోరువారి యుత్సాహము ఫలించుటకును, శైవస్వరూ పము తద్భక్తియు నవగాహన జేసుకొను యథార్థ బుద్ధిని నివసించుటకును, స్వపరిగృహీత శైవదీక్షా సార్థక్యమునకును గురుమాహేశ్వర విధేయుఁడనై యవమేతదనువాదమును ప్రథమ భాగముగా వెలయించితిని.

ఇద్దాని ముద్రణకు తోడుపడిన వదాన్యులు—శైవులు, బ్రాహ్మణులు, వైశ్యులు తదితరులును సర్వదా నాచే యభినందింపఁబడువారు. తన యనూనా ల్యాశయముల నడుగుటతోడనే వ్రాసియిచ్చిన పండితప్రకాండులు సర్వథాభి వాదనీయులు; ఎట్టి స్ఖాలిత్యములను పడనీయక సర్వాంగసుందరముగా నేతద్గ్రంథమును ముద్రించి యిచ్చిన శ్రీనివాససోదర ముద్రణాలయము లెంతయు ప్రశంసనీయులు.

ఇట్టి సదుద్యమ మాచంద్రతారార్కము విలసిల్లి సూపయుక్తం బగునని యాశంసించుట సరసహృదయుల కనివార్యం బగుగదా యని విరమించు చున్నాను.

ఇట్లు
నిర్మల శంకరశాస్త్రి

శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# శ్రీకంఠీయ బ్రహ్మసూత్ర భాష్యాంధ్రీకరణ పీఠిక

"న్యాయవేదాంతాయుర్వేదాభిజ్ఞ"
బ్ర. శ్రీ మూలంపల్లి రాజశేఖరశాస్త్రులు
లచ్చుపేట, మెదక్ మండలము (ఆంధ్ర)
దుర్ముఖి కార్తికపూర్ణిమ.

## ఆచార్యభాష్య ప్రాచీనత్వము

ప్రస్తుతము కనఁబడుచున్న ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతముల యొక్క యాచార్యులకంటె నత్యంత ప్రాచీనులై శ్రీ వేదవ్యాస విరచిత బ్రహ్మసూత్రములను వ్యాఖ్యానించిన శ్రీకంఠ శివాచార్యులవారు తత్సము ల్లిఖిత భాష్యంబును సువిదితము లనుట నిర్వివాదాంశము.

తథాపి – వేదము లసాధారణ మానవప్రణీతము లగుటచే పౌరుషేయ ములనియు వైదికధర్మము లవైదికము లనియు సంప్రదాయము లన్నియు నర్వాచీనములనియు వాదించు ఆధునిక శిరోమణులు నిక్కలికాలమున లేక పోలేదు. ఇట్టి వారిలో కొందరు శ్రీ నీలకంఠభాష్య ప్రాచీనతను శంకించు వారు, మరికొందరు తత్ప్రామాణ్యమునందు నైమత్యము కలవారును గలరు.

నిరంతర శివార్చన క్షాళిత కల్మషులగు శైవులైననో పదేపదే వినఁబడు ప్రతిపక్షవాదము లవిచారిత రమణీయములని త్రోసిపుచ్చక ననభిజ్ఞతాకారణ మునఁ బ్రామాణ్యవాదులముందు తత్ప్రతికూలవాదముల ననువదించు చుందురు.

ఇట్టితటి ప్రప్రథమ విచారణీయాంశము.

"శ్రీ నీలకంఠ శివాచార్యులు శంకరాచార్యులకంటె పూర్వికుఁడు కాడు. ప్రత్యుత పదునొకండవ శతాబ్దమువాడని యాంగ్లేయ పండితులు నిరూపించిరి." అనునది.

పై వాద మెంత దుర్బలమైనదో చూడుడు!

సర్వవేదాంత వ్యాఖ్యానకర్తలు, పంచదశ్యాద్యనేక గ్రంథకర్తలు, ప్రతివాది ప్రామాణిక పీఠాధిరోహులు నగు శ్రీ విద్యారణ్యస్వాములవారు తమ శంకర విజయమున "శ్రీ నీలకంఠాచార్యులు" శంకరాచార్యులతో వాదించెనని "శివ తత్పరసూత్ర భాష్యకర్తా" ఇత్యాది సందర్భమును తెలుపుట ప్రాచీనతకు నొక సాక్ష్యము.

ఇంతమాత్రమున "శంకరాచార్య సమకాలికుఁడు వేరు, ప్రస్తుత శ్రీకంఠ భాష్యకర్త వేరు" అని స్వీయ నిర్హేతుక తర్కమును నూతగాగొని నీలకంఠ శ్రీకంఠనామద్వైవిధ్యమును వాదించుటయు సరిగాదు.

సర్వతంత్రస్వతంత్రులు, ఉపక్రమపరాక్రమ సిద్ధాంతలేశాది పరిమళ పర్యంతానేక గ్రంథనిర్మాతలు, అద్వైతవిద్యాచార్యులు నగు శ్రీమదప్పయ దీక్షితేంద్రులు శ్రీకంఠభాష్యమున "పూర్వాచార్యైః" అను పదమును వ్యాఖ్యానించు సందర్భమున — శ్రీకంఠాచార్యులు శంకర రామానుజా చార్యాదులకంటెఁ బూర్వికులని — నిరూపించుచు శ్రీ నీలకంఠాచార్య పూర్వికులగు తత్తన్మతప్రబోధక వ్యాఖ్యానకర్తలు పలువురు శ్రీయరామి "ఏషాం పూర్వపూర్వ గురవః" అని నిర్ధారించిరి.

ప్రకృతాచార్యరచనశైలి — సూత్రానుగత్వ సౌందర్య మాధుర్య ములు గలదియు వైయర్థ్యకాఠిన్యాది దోషములు లేనిదియు నగుటచే శ్రీకంఠశివాచార్యులు శంకర రామానుజాచార్యాదులకన్న నర్వాచీనులని చెప్పు నంశము కుతర్క భూయిష్ఠమగుచున్నయది.

అత్యంతప్రాచీనులగు శ్రీకంఠాచార్యుల సమకాలములో తత్పూర్వ మందును తాదృశవ్యాఖ్యాతలుండనగుననియు, తాత్కాలికదృష్టిని వారు ఆచార్యపదాభిధేయులైరనియు "పూర్వాచార్య" పదమును సమర్థించుట (పూర్వోక్తప్రాచీనతకు) రెండవసాక్ష్యము.

ఏతత్పదార్థము పాఠకమనుచో

శ్రీ హాలాస్యనాథశాస్త్రిగారు తమ మతచతుష్టయ సంగ్రహమునందు "శ్రీకంఠ శంకర రామానుజానందతీర్థాః క్రమేణ భగవచ్ఛాపతీర్ణాః" అనియు "శ్రీకంఠభాష్యము మొదట పేర్కొనదగినదైనను రామానుజీయ సిద్ధాంతముతో నాతిభిన్నసిద్ధాంతము గలదగుటచే రామానుజభాష్య సన్నిధి నుదాహరింపఁబడిన" దనియు చెప్పుట మూఁడవసాక్ష్యము.

పై విషయములు పరులలో పరమప్రామాణికులగువారిచే స్పష్టీకరింపఁ బడినందున పాశ్చాత్యవిద్యా సంస్కృతి వ్యామోహ వినష్టభారతీయవిజ్ఞానుల వాదములు స్వీకార్యములు కాకుండుటయేగాక సనభిజ్ఞులగు సనాతనుల నిరూపణలుగూడ నగ్రాహ్యంబు లగుచున్నయవి.

"పూర్వకాలము శ్రీ చిన్నబొమ్మ నృపాలుఁడు బహుళధనము నొసఁగి శ్రీ అప్పయ దీక్షితేంద్రులను ప్రార్థింపగా వారు భాష్యమునురచించి స్వవిరచిత

భాష్యము ప్రమాణ పదవి నధిష్ఠించుటకు మరియొకరి పేరుతో నంకిత మొనర్చి" రని కొందరు శ్రీ కంఠీయ సర్వతోముఖ ప్రామాణ్య భానుమండలముఁ గ్రసింపఁదలచిరి.

"అట్లయినచో స్వమత భాష్యము లన్నియు నాలాటివే" యని బుద్ధిమంతులు చెప్పునెడ స్వప్రామాణ్యహాని సంభవించునని తెలియకుండుట శోచనీయము.

శంకరాచార్య సమకాలికత్వము, భాష్యపరాభవంబు శంకరవిజయమం దుదాహరించుటచేత నంగీకరించిన ట్లగునని యప్రామాణ్యము సిద్ధ మనినచో- శంకరాచార్య ఖండితములైన తప్తచక్రాంకణ జ్ఞానసముచ్చయవాదాదులు నేటివరకును వైష్ణవ, శైవ పక్షములం దప్రమాణములని నిరాకరింపఁబడకుండుట లోకవిదితము గావున నట్లే శ్రీ నీలకంఠభాష్యము ప్రామాణికత్వముతో కూడిన సర్వప్రాచీనత్వము కలదని చెప్పవచ్చును.

వస్తుతః

శ్రీ నీలకంఠాచార్యులు శంకరాచార్యులకంటె ప్రాచీను లగువారు. ఎట్లన? అత్యంత ప్రాచీనులగు భట్టభాస్కరాదులు శంకరాచార్య సమకాలికులని స్వమత విశ్వాసమును దృఢీకరించుటకు చెప్పఁబడినట్లు శ్రీ నీలకంఠ శివాచార్యులును తత్సమకాలికులని శంకరవిజయ గ్రంథమునందు ప్రతిపాదిత మయ్యెను.

అట్లు కాదందురేని,

శ్రీమదప్పయ దీక్షితేంద్రుల శివాద్వైత నిర్ణయాదు లసమంజసములు కావలసివచ్చును. "నీలకంఠ భగవత్పాదుల యభిప్రాయము శంకరాచార్యా విరుద్ధమని దీక్షితులు నిర్ణయించుటచే శంకరాచార్యఖండితత్వ మీ భాష్యమునకు వాటిల్ల నేరదు.

"ఖండితంబని శంకరవిజయ మందలి విద్యారణ్య నిరూపణకు దీక్షిత ప్రతిపాదనకును ఏకవాక్యత కలుగవలె" నన్నచో, యపచ్ఛేదన్యాయము ననుసరించి విద్యారణ్యానంతరుఁడగు దీక్షితుల యాశయమే సరియైనదని చెప్పవలసి వచ్చును.

అట్లైనయెడల-దీక్షిత ప్రతిపాదిత మంతయు నంగీకార్యమనుచో-మతావేశముతో చెప్పఁబడినవి దక్క నితరము లన్నియు శైవజనాభ్యుపేతములే యగుచున్నవి.

ఇంతియే గాక నద్వైతులలో కొందరు-తమ సిద్ధాంతమును శ్రుతిసూత్ర విప్రతిపత్తులఁ గాంచి యుపేక్షాభావముఁ బడయజొచ్చిరి. మరికొందరు-ప్రాచీన మహర్షి నిర్మితవృత్త్యనుస్యూతము, సూత్రానుగతంబు నగునది వైశిష్ట్యవాదమని "వైశిష్ట్యమును బోధించునదని" తాత్పర్యలింగములుగా భాసించు రామానుజ మతమునం దాదరము గలవారైరి. ఇంక కొందరు రామానుజాంగీకృత పథము శ్రీకంఠాచార్య ప్రదర్శితమని యుండుటచే శివాద్వైత మతమునం దభినివేశము గలవారైరి. తదితరులు "మాయావాద మసచ్ఛాస్త్రమ్" అను భవిష్యత్పురాణాది ప్రమాణముల ననుసరించి యద్వైతము వైదిక బహిష్కార్యమని నుడువు సందర్భమున దీక్షితులు రామానుజ మతమందు విశిష్ట బ్రహ్మవాదము, నారాయణ పరత్వంబునని రెండు విభాగములఁ జూపెట్టి యందు మొదటిదగు విశిష్టాద్వైతము స్వప్రతిభా ప్రతిపాదితము గాక శ్రీ నీలకంఠ బోధాయనాభిప్రేత మనియు, రెండవదైన నారాయణ పరత్వము శ్రుతిస్మృతి పురాణాది బహిష్కృత మనియు నిరూపించిరి.

ఇందుకు శివకర్ణామృతము, రామాయణ భారత తాత్పర్యములు ఆనందలహరి, శివాద్వైత నిర్ణయాది గ్రంథములు ప్రమాణములై యున్నవి.

మరియు దీక్షితులు శ్రీ నీలకంఠీయము శాంకరాద్వైతావిరోధియని సాధించి విమతులగు రామానుజీయు లవైదికులనియు శైవు లద్వైతులే యనియు శాంకరీయము మాయావాదము కాదనియు ప్రత్యుత ఉపనిషత్ప్రతిపాదితంబనియు నిపుణముగా సమర్థించుట స్వప్రభాబలజన్య మగుటచే నియ్యది ప్రామాణికము కాదని శ్రీ శివయోగి, మహోపాధ్యాయ, బ్ర. శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు తమ వ్యాసపథమున నిర్ధారించిరి.

యథా ?

భీష్మద్రోణముఖాః సుయోధనపక్షే శౌర్యం ప్రదర్శ్యాప్యుచ్చైః
నావాపుర్విజయం యథైవ భువనప్రఖ్యాతకీర్తిప్రమాః
విద్వాంసోఽప్పయదీక్షిత ప్రభృతయోఽప్యద్వైతపక్షే తథా
నాపుః సిద్ధి మభీప్సితస్య కృతిభిః శక్తిం ప్రదర్శ్యాత్మనా.

అద్వైతపక్ష నివిష్టులైన దీక్షితాదులయొక్క ప్రతిభావిశేష మెంతయు కొనియాడదగినదే. తథాపి సుయోధన పక్షవర్తులగు భీష్మద్రోణాచార్యాదుల పరాక్రమమువలె సఫలము కాకుండుటయేగాక ప్రతివాది విజయావహం బయ్యెను.

కావున శ్రీకంఠ శివాచార్యులు పరమప్రాచీనులనియు, తదభిప్రేతమే సర్వశిష్టజన శిరోధార్యంబనియు నంగీకరింపనగును.

## స్వవిరచిత
# శివాద్వైత సిద్ధాంత రత్న పంచకము

శ్రీమచ్ఛైవమతే శివః పరతమో జీవప్రపంచౌ స్థిరౌ
చైతన్యాదిగుణైః శివేన సమతా మాప్నోతి జీవః కిల
బద్ధః శంభుసమిచ్ఛయాఽద్య పశుతాం ప్రాప్తః పుమాన్ సంసర
త్యార్తః సన్ తదనుగ్రహాచ్ఛివసమో భక్త్యా చ ముక్తో భవేత్. ౧

బ్రహ్మశ్రీమంతమగు శైవమతమునందు శివుఁడు పరాత్పరుఁడు, జీవ జగములు సత్యములు, జీవుఁడు చైతన్యము మొదలగు ధర్మములతో శివ సమానతను పొందువాఁడైన నీశ్వరేచ్ఛవలన సంసారబద్ధుఁడై పశుత్వము గలవాఁడై జననమరణాది ప్రవాహ నిమగ్నుఁడగుచున్నవాఁడు. ఆర్తుఁడై భక్తుఁడగునేని వాని యనుగ్రహమువలన సంసారముక్తుఁడై సర్వథా శివసముండగును.

విశ్వాతీత మమేయ మాద్య మమలం విశ్వాత్మకం కారణం
కార్యం చోభయ మేకమేవ శివశక్త్యోః సామరస్యం జగత్
ముక్తిః శాశ్వతనైజలాభవిషయా సృష్ట్యాదివ్యాపారతః
శూన్యాఽఽనందమయా చ శంభుపదవీ విశ్వోత్తరా సద్గతీ. ౨

బ్రహ్మము విశ్వాతీతము అమేయము ఆద్యము నిర్మలము విశ్వమయంబును. విశ్వాతీతముగా కారణంబు విశ్వమయముగా కార్యంబు నగు బ్రహ్మ మొక్కటియే; జగము శివశక్తులయొక్క సామరస్యముగా నేర్పడినది. మోక్షము-శాశ్వతముగా నిజరూప (శివసమానత్వ) మును పొందుట విషయముగా కలదియు సృష్టి స్థితి లయ తిరోధానానుగ్రహాఖ్యపంచకృత్యములు లేనిదియు ఆనందమయంబు నగును. ముక్తప్రాప్యమైన శివపదము-బ్రహ్మాండ సీమ నతిక్రమించి విరాజిల్లునది.

ఆనందప్రచురః పరాత్పరతను శ్చిచ్ఛక్తియుక్తో విభుః
సూర్యాకాశవదేష దోషరహితః కైలాసవాసీ ప్రభుః
భక్తోద్ధారపరో విచిత్రగతికః కారుణ్యసింధుః శివః
సృష్ట్యాదికృతిపంచకం వితనుతే లీలార్థ మేవాభయమ్. ౩

బ్రహ్మశబ్దపర్యాయంబగు శివశబ్దముతో నిర్వచింపఁబడు పరమాత్మ — ఆనందపరిపూర్ణుఁడును, బ్రహ్మవిష్ణ్వాద్యతీత స్వరూపము గలవాఁడును, చిచ్ఛక్తితో కూడియుండువాఁడును, సూర్యునివలె స్వయంప్రకాశమానుఁడును, ఆకాశమువలె సర్వవ్యాపియు క్షుత్పిపాసాది ప్రాకృతదోషములు లేనివాఁడును

కైలాసవాసియు సర్వనియామకుఁడును కర్మజ్ఞానసముచ్చితమైన భక్తిగల వారిని సంసారసాగరమునుండి యుద్ధరించుటయందు దానసక్తి గలిగియుండు వాఁడగుటచే భక్తుల యపరాధములను శోధించుటకై నానావిధ లీలలఁ జూపువాఁడును, కరుణాసముద్రుఁడును భక్తులకు నిజవిలాసమును ప్రదర్శించుటకు మాత్రము సృష్ట్యాదివ్యాపారమును నిర్భయముగా గావించువాఁడునని గురు తెరుగవలెను.

శ్రీకంఠోక్తశివాగమాదివిధినా పంచాక్షరీదీక్షితః
లింగాంగీ నిజవర్ణధర్మసహితః షట్కాలపూజాపరః
భస్మాద్యావరణాష్టకాదినిరతః శ్రీకంఠసిద్ధాంతభాక్
వైరాగ్యాదిచతుష్టయాన్వితమనాః శంభుం భజేచ్ఛాశ్వతమ్.

పరమేశ్వరప్రణీతములగు నిగమాగమములందు ప్రతిపాదింపఁబడిన విధి ననుసరించి శివపంచాక్షరీమంత్రగ్రహణము, శివలింగధారణ మొదలగు శాంభవదీక్షనవలంబించి స్వవర్ణాశ్రమోచితధర్మము నాచరించువాఁడై ప్రాతః సంగవ మధ్యాహ్న సాయం ప్రదోష నిశీథములనఁబడు షట్కాలములందు కరతలమున నిష్టలింగము నారాధించుచు భస్మరుద్రాక్షాది ఆవరణాష్టకమునం దాసక్తి గలిగి శ్రీకంఠాచార్యసమ్మతమగు శివాద్వైతసిద్ధాంతమునం దభిరుచి గలవాఁడై విరాగము భక్తి మున్నగు సాధనచతుష్టయముతోఁ గూడిన యంతఃకరణము(తో) నందు నిత్యసత్యరూపుఁడైన పరశివుని ధ్యానించవలెను.

విద్యా కర్మసమాశ్రితా శివపదం ప్రాప్యం ముముక్షోః పరం
బ్రహ్మానంతగుణాన్వితం హరిపరం తృష్ణాదిహీనం మహత్
వేదాద్యాగమకర్తృసామ్య మభవస్యైవోదితం శంకరా
త్కర్తుః కర్మ ఫలత్యహో బుధజనాః శైవం సమాకర్ణ్యతామ్.

జ్ఞానాత్మకమగు శివోపాసన—స్వవర్ణాశ్రమోచితకర్మానుష్ఠానసముచ్చితమైనది. ముముక్షువునకు సర్వాతీతముగా శివపదము ప్రాప్యం బగునది. బ్రహ్మము—ఆకలి మొదలగు క్షుద్రగుణములు లేనిదై అసంఖ్యకల్యాణగుణములతోఁ గూడినదియు నారాయణునకన్న శ్రేష్ఠంబై గొప్పదియు నగుచున్నది. వేదశాస్త్రములు ఆగమములు మొదలగు సప్తాదశవిద్యలకు ఏకైక కర్తృత్వము పరమేశ్వరునకే శ్రుతియందు నిరూపింపఁబడినది. నిస్పృహుఁడై గాని ముక్తికాంక్షతో కర్మల నాచరించు పురుషుని ముక్తిసాధనముగాని సుఖసాధనము గాని పరమేశ్వరుని వలననే ఫలప్రద మగుచున్నది.

ఇత్యాది వివరముగల శైవమత స్వరూపమును సర్వమత రహస్యమును గల పండితు లవధరింతురుగాక!

# పండితాభిప్రాయములు

శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాన్నమః

**కవిభూషణ, శతావధాని, జ్యోతిర్విద్యావిశారద,**

*బ్ర. మదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రి అయ్యవారు,*

**ఈమని, తెనాలితాలూకా, గుంటూరుమండలము. 27-9-1960.**

అయం హి శ్రీ నిర్మలవంశ సత్సుధా
పయోధి సంపూర్ణ కళానిధిః సుధీః
బభౌ సదా శంకరశాస్త్రి నామా
ప్రసిద్ధ గీర్వాణ కళాకలాపః.

నందిప్రకాశోత్తమ నామధేయ
గ్రామే స శ్రీకంఠకృతాత్మభాష్యమ్
ప్రవక్తు మేవాగత ఇత్యహం తం
జగామ తద్దర్శనసాభిలాషః.

జ్ఞానానంద సరస్వతీ యతివరైః పూర్ణయ్యనామాదిభిః
సుబ్రహ్మణ్యయుతైశ్చ సద్ద్విజవరై రాహూత ఇత్యాదరమ్
శ్రుత్వా తద్విషయం తథేతి పరమో మోదోఽభవన్మే మతా
వాకర్ణ్య స్ఫుటసూత్ర భాష్యవచనం వక్తుం సముత్సాహవాన్.

శ్రుత్వాఽనేకైశ్చ సద్భిః ప్రవచన మహం నీలకంఠస్య భాష్య
స్యాత్మన్యామోద మేవం స కథ మగమ మిత్యంతరానందపూర్ణః
స్వల్పైః కాలైః కథయితు మలం దక్ష ఇత్యేవ హేతో
ర్యావజ్జీవం శ్రుతమపి భవేదేవ పూర్ణానుమోదః.

యమన్నపూర్ణా సతి రామనాథా
దవాపతుః పుత్ర మవాప్య మోదమ్
యశః సదా ఽనన్యసులభ్య మూర్త్యాత్రం
స శంకరః శంకర ఏవ సాక్షాత్.

గీర్వాణభాషా మధురోపహార
ప్రసక్త సమ్యగ్రుచి మాతనోతి

త్రైలింగ్య భాషా కథితానువాదః
పీయూష సమ్యగ్రుచి మాదధాతి.

వపుషి నవవయః స్యాత్తస్య గీర్వాణవాణ్యాం
వచసి మధురసోక్తిః శ్రోతృ పీయూష రక్తిః
మధురమృదుల భావః సానుభావ ప్రభావః
సుమహిత శివభక్తి ర్దృశ్యతే సత్సుధీభిః.

సోఽయం శ్రీకంఠ విద్యాభూషణ ఇతిచ గీర్వాణ సాహిత్యరత్నః
శైవోదాత్త స్ఫుర ద్వాఙ్మయజలధి రితి ప్రస్ఫుటం కీర్త్యమానః
నానాభాష్యార్థవేదీ శ్రుతివిహిత గీతార్థబోధానురక్తః
నిత్యం విద్వత్సభాయాం జయతు జయతు శైవానుకంపా ప్రభావాత్.

శైవాంధ్రసోదర మనఃస్థిత సర్వశంకా
విచ్ఛేదదక్ష మధురాంధ్రకృతానువాదః
భాష్యస్య శీఘ్ర మతిసుందర ముద్రితః స్యా
చ్ఛంభోశ్చ శైవనికరస్య ముదే భవేచ.

మతం హి శైవం భువి సుప్రసిద్ధం
హితం శివాద్వైతపరం హి భాష్యం
ఆంధ్రానువాదః కిల శంకరస్య
త్రయం సదా లోకసుసిద్ధయే భవేత్.

గీర్వాణాంధ్రద్వితయ రచనా నల్పశక్తి ప్రబుద్ధః
శైవారాధ్యానుపమ శివపూజా ప్రభావోపలబ్ధః
శ్రీకంఠీయ ప్రవిమల మహాభాష్య సంపూర్ణరూపః
లోకే నిత్యం జయతు స మహాన్ శంకరాంధ్రానువాదః

శ్రీశివాభ్యాన్నమః

బ్ర. శ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు
సికింద్రాబాదు (మారేడుపల్లి).

నీలకంఠభగవత్కృతశైవభా
ష్యప్రకాండవివృతిం వ్యాకయంగమం

మల్లికార్జునమహావిబుధాన్వయ
క్షీరధీందు రకరో దిహ శంకరః 1
నీలకంఠశివాచార్య • నిరుపమాన
భాష్యటీకను నిర్మలా • వాసియైన
మల్లికార్జునపండిత • మహితకులుఁడు
శంకరబుధుండు తెల్గున • సంతరించె. 2
ఇది పాఠకులకు శ్రోతల
కొదవించును ముదము మిగుల • నుపయోగంబై
పొదలును శివనిష్ఠుల కి
యది యార్జింపంగఁ దగు మ • హాధననిధి యౌ. 3

ఇఁకను 4

సదయాత్ముఁడు శివుఁ డీ కో
విదవర్యుని శంకరబుధు • వెలయించుత నిం
పొదవఁగ దీర్ఘాయుస్సం
పద లొసఁగి చిరమ్ము సూరి • వర్గము లలరన్. 5

పరస్మై శివాయబ్రహ్మణేనమః

**శివయోగి ప్రేమాభిలాషీ**

*ప. ప. జ్ఞానానందేంద్ర సరస్వతీస్వామి*

**శ్రీదుర్గాక్షేత్రం, నందివెలుగు,**

**తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా.**

**శార్వరి ఆశ్వీన శుక్లద్వాదశీ భానువాసరః**

స్వస్తిశ్రీ శార్వరీ సం. శారద నవరాత్రే చతుర్వింశతి తమ వార్షికోత్సవే ష్వస్మదాశ్రమే న్యైన నిర్వర్తితేషు శ్రీకంఠాచార్యకృత బ్రహ్మసూత్ర భాష్య ప్రవచనార్థ మాపంతితాః సంతః శివయోగినః శ్రీ త్రిలోకి గురు మల్లికార్జున పండితారాధ్య వంశ్యాః శ్రీ శంకరశాస్త్రిణః ఆంధ్రోత్తరప్రాంతీ యాదిలాబాన్మండలస్థ నిర్మలతాలూకా పత్తనవాసినః సహాయే హ్యుపస్థితా భాష్య కాలక్షేపం నిరంతరాయం నిరవహాంశ్చేతి ప్రమోదస్థాన మస్మాకమ్.

ఏతే శాస్త్రిణః కిమప్యాంధ్రీకరణం శ్రీకంఠ భాష్యస్య రచయామాసుః సమీక్షార్థ మద్యాప్యముద్రితా మేషా కృతి రస్మభ్యం దత్తా చతుఃసూత్రీ

పర్యంతమ్. శివ వేదాంతచింతామణిభూతస్య ప్రోక్తభాష్యస్య ప్రభాఖ్య వ్యాఖ్యాం కామప్యనురుంధ్య సునిర్వహింత మేతదాంధ్రీకరణ మితి విజ్ఞాయతే.

విశిష్టశివాద్వైతం తత్త్వం వ్యాకృతావ్యాకృత చిదచిన్మయ ప్రపంచ శరీరక మత్ర (భాష్యే) సువిశదం ద్యోత్యతే స్యాంధ్రవాణ్యా మఘుణ్ణ సంస్కృతభాషానాం జిజ్ఞాసూనాం సుఖప్రతిపత్తయే సన్నిష్ఠాభ్యసనాయ చేతి నాత్ర సందేహః.

సర్వవేదాంతసారస్య సౌరభాస్వాద మోదినాం
ఆర్యాణాం శివనిష్ఠానాం భాష్య మేతన్మహానిధిః

ఇత్యుక్తరీత్యా భాష్యమిదం సర్వాంగలింగసాహిత్యేన శివం ప్రపన్నానా మార్యాణాం శైవమహాజనానాం దర్శనమాత్రేణ సువానందకరం, సకల వేదాంతార్థ నిర్ణయేన నిరంతర శివధ్యానోపయుక్త సకలకల్యాణ గుణగణ మహిత తదీయ రూపవిశేష సమర్పకం చేతి యదుక్తం శ్రీనాగలింగశాస్త్రి శివచరణైః ప్రభాముఖేన తత్సూక్తం శ్రీ శాస్త్రిభి రేవేతిదిక్.

శ్రీ సదాశివ బ్రహ్మణేనమః

**శ్రీ వజ్ఝల చంద్రమౌళిశాస్త్రీ,**
**సాహిత్య మహోపాధ్యాయః, అద్వైతవేదాంత, D. O. L.**
**వేములవాడ.**

లోకారాధ్యస్య భగవతో నీలకంఠారాధ్యస్య కృతేః సూత్ర భాష్యస్య ఆంధ్రభాషాయా మనువాదోఽయం నిర్మలవాస్తవ్యైః నిగమాగమ విశారదైః లోకారాధ్య శ్రీ శంకరశాస్త్రివర్యై ర్విరచితః చతుః సూత్రీ పర్యంతః ఆమూలాగ్ర మవలోకితో మయా.

శ్రీ శాస్త్రిణాం భాష్యహృదయాభిజ్ఞత్వేన శాస్త్రీయార్థం భాషాంతరే సమ్యగవతారయాం బభూవురితి నాతివిచిత్రమ్. కింతు మృదుమధుర పద గుంభనేన పండితపామర జన మనోమోద జననక్షమయా భాషాపాటవం దర్శ యామాసు రితి మోమోత్తి మే చేతః.

పూర్వపక్ష సిద్ధాంత ప్రదర్శన పురస్సరం భాష్యరహస్యార్థ మనువాద రూపేణ జనసామాన్యస్యాపి హస్తామలకకల్పం విదధుః. సంస్కృతాభి జ్ఞానా మపి భవాంబుధి తితీర్షూణా మత్యంతోపకారాయ భవే దయ మనువాద ఇతి మన్మహే.

గంభీర భాష్యార్థః శ్రీశాస్త్రి మహోదయానాం సమ్యక్ జ్ఞాతో౽ను భూతో విరాజత ఇతి ప్రతిభాతి. యతో మహాపురుష నీలకంఠారాధ్యస్య మహాభాష్య మాంధ్ర్యాం సుబోధం కృతమ్.

సర్వే జనాః ప్రత్యహం పఠనపాఠనాభ్యాం వేదాంతార్థం సమ్యక్ జ్ఞాత్వా సదాశివానుగ్రహస్య పాత్రీభూత్వా పరశివ కైవల్యం ప్రాప్నుయు రిత్యాశాసే.

అల్పీయసి వయసి విద్యమానా అపి శ్రీశాస్త్రిణః శుక వామదేవాదయ ఇవ జ్ఞానినో భూత్వా లోకోద్ధరణం కుర్వంతీతి ప్రమోదాస్పదమ్.

చిత్రం వటతరో ర్మూలే వృద్ధాః శిష్యా గురు ర్యువా
గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛ్చిన్నసంశయాః.

సాక్షాచ్ఛివ పతీనాముర్త్యంశభూతానాం శ్రీవ్యస్య సాయణాది ముఖస్య అనుగ్రహం సంపాదయతాం శాస్త్రిసదృశానాం సుజనానా ముపనిషదర్థ విమర్శనం సహజాతమేవ. ఇతిశమ్.

శ్రీ పార్వతీరాజరాజేశ్వరాభ్యాన్నమః

వ్యాకరణ వేదాంతాయుర్వేదాది సాహిత్యవిద్వాన్
బ్రహ్మశ్రీయుత, లోకారాధ్యులైన
కామర్సు చంద్రమౌళిశాస్త్రిగారు, M.D.H.S.A.S.V.
**లక్ష్మీపురము, (లచ్చపేట)**
**సిద్దిపేట తాలూకా, మెదక్ జిల్లా. (ఆంధ్ర)**

"శ్రీకంఠవిద్యాభూషణ" "సంస్కృతసాహిత్యరత్న" "శైవవాఙ్మయార్ణవ" బిరుదాంకితాః శంకరశాస్త్రి మహోదయాః! సాదరమిదం సముల్లిఖామి.

దృష్టంకిల తత్రభవద్భి రాంధ్రీక్రియమాణం శ్రీ మచ్ఛ్రీకంఠీయం సూత్రభాష్యమ్. "వ్యాససూత్ర మిదం నేత్రం - విదుషాం బ్రహ్మదర్శనే" సాంగసశిరస్క వేదాధ్యయనేనాపాతతో౽ధిగత బ్రహ్మస్వరూపాణాం బ్రహ్మ దర్శనే 'ఇదంఇత్థం భూత మితి, పరిచ్ఛేదాత్మకే నిర్ణయే' ఘటాది పరిచ్ఛేదే నేత్ర మివ, నిరపేక్షకారణం యథేదం సూత్రజాతం భవతి తథా సూత్ర భాష్యార్థభూత మేత దాంధ్రవాఙ్మయం సమధీతసాంగశిరస్క వేదానాం

విదుషాం సకాశా ద్విజ్ఞాత శ్రుత్యాద్యర్థానాం బహుశ్రుత స్మృతిపురాణేతిహాసాదిసారాణా మనభ్యస్త సంస్కృతానామపి పురుషాణాం స్త్రీణాం చ బ్రహ్మబోధసాధనం భవేదిత్యాశాసే. ఏవ ముద్దిశ్యైవ పూర్వైరపి స్వమత భాష్యాణ్యాంధ్రీకృత్య ప్రకటితాని, బ్రహ్మణః సదాశివస్య యథార్థజ్ఞాన సాధనం ఖలు శ్రీ నీలకంఠీయం సూత్రభాష్యమ్.

శ్రీ శివయోగినాం మహోపాధ్యాయినాం తెనాలివాస్తవ్యానాం శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి మహోదయానాం భూతపూర్వశైవపీఠాధిపతీనాం సంప్రత్యధిష్ఠిత శివపదానాం శివచింతామణిప్రభాఖ్య వ్యాఖ్యామనుసృత్యైతద్భాష్యస్యాంధ్రానువాదం విదధతాం భవతాం సముద్యమాత్కేషాం జిజ్ఞాసూనాం న మోదతే చేతః? యథార్థవిమర్శమండితాః కే సహృదయా నానుమోదేరన్? తదేత ల్లేఖనముద్రణాది ప్రబంధస్యాసమాప్తిః పార్వతీ రాజరాజేశ్వరౌ సహాయినౌ యుష్మాకం స్యాతా మితి విరమామి.

శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాన్నమః

## విజ్ఞాసులగు ఆంధ్ర మహిళామణుల ఆమోద నివేదనలు

పరిచిత భాషాపంచక

**సౌ. కామర్సు కమలాదేవి**

లచ్చుపేట, సిద్దిపేట తాలూకా,
మెదక్ జిల్లా (ఆంధ్ర)

బ్ర. శ్రీ. విద్యాభూషణ, సాహిత్యరత్న, పండిత నిర్మల శంకరశాస్త్రి గారిచే తెనిగింపఁబడుచున్న శ్రీ నీలకంఠీయ మహాభాష్యమును పండితాభిప్రాయముకొఱకు మద్భర్తయగు బ్ర. శ్రీ. డాక్టర్ కామర్సు చంద్రమౌళి శాస్త్రిగారి చెంతకు పంపబడినపుడు చూచితిని. తెనుగు వివరణఁ జదివి ముముక్షువులందరి కియ్యది పరమావశ్యకమనియు సహజవిజ్ఞానవంతులు అగ్రజప్రాయులు నగు శాస్త్రిగారికి గల తమ సిద్ధాంతమందలి యభినివేశ మపూర్వమనియు ప్రస్తుతకాల పరివర్తనఁ బట్టి పురుషులేగాక జిజ్ఞాస గల నా తోటి సహోదరీ స్త్రీలందరు నింతటి సరసశైలిని వ్రాయఁబడు భాష్యమును పఠించి ధన్యలు కావలెననియు నభిప్రాయపడుచున్నాను.

శ్రీ శివాయ గురవేనమః

డి. ఎం. నాగలింగశాస్త్రీ
వేదాంతాయుర్వేదవిశారద,
వైద్యవిద్వాన్, సర్జన్. A.V.V.S.
గవర్నమెంటు ఆయుర్వేద డిస్పెన్సరీ,
హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్.

అయి భో ఆస్తికవర్యాః !

శ్రీకంఠవిద్యాభూషణ, సంస్కృతసాహిత్యరత్న, శైవవాఙ్మయార్ణవ, ఇత్యుపాధిత్రయేణ శ్రీ మహామహోపాధ్యాయైః సంస్కృతపత్రికాధిపతిభి రయోధ్యానివాసిభిః కాశీప్రసాదశాస్త్రిభిః ప్రదత్తేన మండితానాం శ్రీ మల్లికార్జునపండితసన్నిభానాం శంకరశాస్త్రిమహోదయానా మిద మాంధ్రీకృతం భాష్యమాపాతతః దృష్టంకిల !

క్షుత్పిపాసార్తానాం మృష్టాన్నపానాదివత్ జననమరణదుఃఖితానా మమృతసుఖ మివ వాతపిత్తశ్లేష్మదూషితానాం మృత్యుంజయమహౌషధ మివ జిజ్ఞాసులోకస్య లబ్ధ మిద మాంధ్రభాష్యం మృదుమధురపదజాలగుంభనేన విరాజమాన మత్యల్పసంస్కృతాంధ్రలోకాంధకారనిబర్హణే బాలభాస్కరోదయప్రతిమం సర్వజనమనోవికాసజనకం చ భవతి.

"వ్యాససూత్ర మిదం నేత్రం – విదుషాం బ్రహ్మదర్శనే" సర్వథా అప్రత్యక్షం బ్రహ్మ ఉపనిషదర్థ సమన్వయాత్మకబ్రహ్మవిచారశాస్త్రజ్ఞానేన నిశ్చితతయా స్వాత్మని ప్రత్యక్షీభవతి శివాద్వైత నిష్ఠానాం సర్వాంగలింగ సాహిత్యేన శివం ప్రపన్నానాం షట్కాలత్రికాలకాలద్వయఏకకాలాన్యతమ సమయే నిత్యం శివపూజారతానాం షడక్షర్యనుసంధానపరాణాం షట్స్థల వివేకపంచాచార అష్టావరణ షల్లింగదీక్షాత్రయాద్యభినివేశవతాం మాహేశ్వరాణా మిత్యాదిపరిజ్ఞానం సుష్ఠుప్రాపయితు మలమాంధ్రీకృత మేతద్భాష్యమ్.

అతో యాథార్థ్యసంగ్రహణలోలుపధియః సుధియః సదా శివవైభవానందాస్వాదమత్తచిత్తా మాహేశ్వరాశ్చ పఠనపాఠనాభ్యా ముపయుంజ్యేదం శివాద్వైతస్వరూపం చ సుబుద్ధ్యై స్వజను శ్చరితార్థం విదధీర న్నిత్యాశాసే.

శ్రీ మేధాదక్షిణామూర్తే రవ్యాజానుగ్రహపాత్ర మేతే శాస్త్రిణః పూజ్యచరణాః స్వకృతపరిశ్రమసాఫల్యం సర్వశైవజనోపయుక్తమాంధ్రభాష్యం భవతీ త్యస్మిన్ మన్వానా ఆంధ్రీకృతేతరభాష్యసమగ్రానువాద

ప్రకాశనాదికం సత్వరం విధాతుం శివానుగ్రహం ప్రార్థయంతే. ఏతదనుమోదకసహాయకప్రేరకమహాశయేభ్యః నిరంతరశుభపరంపరా మాకాంక్షంతే చేత్యత్ర మే స్యాత్సంపూర్ణానుమోదః.

శ్రీ సదాశివో విజయతేతరామ్

*శ్రీ రామగిరి సిద్ధరామేశ్వరశర్మా,*
**సాహిత్యాలంకారః, లక్ష్మీపురమ్.**
**మెదక్ మండలమ్-ఆంధ్రప్రదేశః.**
**శార్వరి కార్తీక శు ౧౩ భౌమవాసరః.**

అయి భోః ప్రతీచ్యచరణా భారతీయాః? సప్రశ్రయం కించిన్నివేదయే!

అస్తీదం భారతం వర్షం శ్రుత్యుక్తకర్మజ్ఞానభక్తిభాండార సముల్లసితమ్. అత్ర మహేశాంశావతారశ్రీమతాం లోకారాధ్యానాం శంకరశాస్త్రిమహోదయానాం మద్గురువర్యాణా మనల్ప సేవాయాం మనూదిత భాష్య ప్రకాశనావసరే స్వాశయ మనల్పోపి బాల్యచాపల్యా దావిష్కరోమి.

యదేత న్మహాభాగై రశేష శైవమహాజనోపకృతయే శ్రీమన్నీలకంఠీయ భాష్యస్య అనువాదః సహృదయహృదయావర్జకతయా సముల్లేఖితః. యత్ర వేదవేదాంతగత సంశయ నిరాసపూర్వకం భస్మరుద్రాక్ష శివలింగధారణాదికం స్వసంప్రదాయం పరిజ్ఞాతుం శక్నుయుః సర్వథా శ్రౌతశైవాః.

విశేషతః మద్విధేభ్యః సంస్కృతానురాగిభ్యః పాశుపతేభ్యః భాష్యస్యామూలాగ్ర మనధ్యయనేఽపి మూలస్థవిషయాన్ శివచింతామణి ప్రభాఖ్య వ్యాఖ్యానాంశాంశ్చ సమ్యగావేదయత్యేష గ్రంథ ఇతి యథాశ్రుతం నిశ్చినోమి.

సుగ్రాహ్యస్యానువాద స్యైతస్య సమగ్రముద్రణ ప్రకాశనాద్యర్థే మాహేశ్వరావతంసాః పూర్వాధికశ్రద్ధా సముత్సాహం సంపన్నాః సంతః సాహాయ్యం ప్రదద్యురితి ప్రమోద పురస్సర మభ్యర్థయే చ.

*శ్రీ శ్రీనివాస సోదరౌ*
**. శతావధానినౌ**
**సికింద్రాబాదు**
**శార్వరీ మార్గశీర్ష శు. ౧ మందవాసరః**

శ్రీకంఠ విద్యాభూషణ సంస్కృత సాహిత్యరత్న శైవ వాఙ్మయార్ణవేత్యాది బిరుదాంకితైః బ్రహ్మశ్రీ నిర్మల శంకరశాస్త్రిభి ర్విరచితం శ్రీకంఠ

భాష్యాంధ్రీకరణం చతుస్సూత్రీ పర్యంతం అస్మన్ముద్రణాలయే ముద్ర్యమాణ మేవ పూర్ణతయా పరిశీలితమ్. తత్రభవతాం సంస్కృత భాషా వైదుష్యం సువిదిత మేవ సర్వేషామ్. సాధారణతయా కథాకావ్యాదీనాం భాషాంతరీకరణ మేవ అసిధారావ్రతమ్; కిముత అతిగహనతత్త్వార్థ నిర్ధారణ ప్రవృత్తానాం అనంత వేదాంత చర్చా పరిపూరితానా మీదృశానాం భాష్యగ్రన్థానామ్. కింతు ఏతద్గ్రన్థానుశీలనేన సుజ్ఞాతం భవతి తత్రభవతా మాన్ధ్రీకర్తౄణాం కఠోరపరిశ్రమ పరిపాటీ కీదృశీతి. అత్యంత గహనమపి తత్త్వం సువిశదాం సులలితా మేవ భాషా మవలంబ్య మూలకర్త్రభిప్రాయాభిన్నం నిర్వహన్తః తత్రభవన్తః శాస్త్రిణః సంసారజంబాలపటలమగ్నానాం అవిదిత వేద్యానా మస్మదాదీనాం పరముపకృతవన్తః. వస్తుతః శ్రీకంఠాచార్యాణాం శ్రీమద్రామానుజాచార్యాణాం మతయోః జగత్కారణం పరంబ్రహ్మసూక్ష్మ చిదచిద్విశిష్ట మేవ జగద్రూపం స్థూల చిదచిద్విశిష్టం భవతీత్యేతద్విషయే న కోఽపి విభేదోఽస్తి. తస్య పరబ్రహ్మణో నిర్వచనే రుచిపరిగృహీతో భేదో వర్తతే. యావన్తో మతి భేదా స్తావన్తో మత భేదా ఇతి భావయన్తః సహృదయాః సర్వాణ్యపి మతాని సభాజనభాజనీ కుర్వన్తి. శ్రీ శంకరశాస్త్రిణా మయం పరిశ్రమః సంపూర్ణః సఫలశ్చ భూయాదిత్యాశాస్మహే.

షట్స్థల శివానుభవ బ్రహ్మవేదనః

శ్రీ శివయోగి కటాక్షాభిలాషి

శ్రీ ముప్పంగి పున్నయ్యపండితులు,

వందివెలుగు, తెనాలితాలూకా గుంటూరుజిల్లా.

యచ్ఛక్తయో వదతాం వాదినాం వై
 వివాద సంవాదభువో భవంతి
కుర్వంతి చైషాం ముహు రాత్మమోహం
 తస్మై నమోఽనంత గుణాయ భూమ్నే.

ఆనందైకరసే చిదాత్మని పరే బ్రహ్మణ్యుమాఽఽశ్లేషతో
యత్తైశ్వర్యవతీశ్వరేత్యభిధయా కాంతిర్ద్యుభేతా స్థితిః
తస్యైకస్య శివస్య మాయికగుణప్రోద్భాసిభేదాం పరాం
విశ్వోత్పత్త్యవనక్షయక్షమతమాం మూర్తిత్రయీం తాం నుమః.

శ్రీమన్నీలకంఠ శివాచార్య కృత బ్రహ్మమీమాంసా భాష్యమున శాస్త్రపీఠికాఖ్య చతుఃసూత్రీ సందర్భమునకు నిర్మల గ్రామవాసి శివయోగి శ్రీ లోకారాధ్య మల్లికార్జున పండితవంశీయ శంకరశాస్త్రి మహోదయులచే రచింపబడిన యాంధ్రీకరణ గ్రంథమును సావధానముగ పఠించితిని.

భాష గ్రాంథికశైలిలో సమీచీన రీతికమై యున్నది. భావములు యోగి శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి చరణ విరచిత శివచింతామణి ప్రభాభిధ వ్యాఖ్యానానుగుణములై విరాజిల్లుచున్నవి.

శ్రీ శంకరశాస్త్రిగారు శ్రీకంఠ విద్యాభూషణాది బిరుదాంకితులు. శ్రీకంఠవిద్య యన సామాన్యముగ శ్రీ శివాద్వైత విజ్ఞాన మనియు, విశేషతః శ్రీకంఠ శివాచార్య ప్రతిపాదిత శివాద్వైత విజ్ఞాన మనియు భావము.

నీలకంఠ చంపునందు - శ్రీమానప్పయదీక్షితో విజయతే శ్రీకంఠ విద్యా గురుః - అనెడి మంగళ గ్రంథదళ వ్యాఖ్యలో "సర్వ వేదాంత సిద్ధాంత కాష్ఠాత్మక శివవిద్యా గురుః శ్రీ దీక్షితః" అనెడి ప్రవచనము - శ్రీకంఠవిద్య యన సర్వ వేదాంత సిద్ధాంత పరాకాష్ఠ యగు శివవిద్యయే యని నుడువు చున్నది గదా! మన శంకరశాస్త్రిగారి శ్రీకంఠ విద్యాభూషణత్వము ప్రోక్త శివవిద్యానుబంధియే యని గ్రాహ్యము.

శ్రీ శంకరశాస్త్రిగారు శ్రీ నీలకంఠాచార్య ప్రోక్త శివాద్వైత పద్ధతిని యథావస్థితముగ నవగహించి ఏతదాంధ్రానువాదమున నిర్దుష్టమైన శివజ్ఞానమును జిజ్ఞాసులోకమున కందజేయగలిగిరి. విశిష్ట శివాద్వైత మనగా ? సూక్ష్మ చిదచిద్విశిష్టుడైన కారణరూప శివుడును స్థూలచిదచిద్విశిష్టుడైన కార్యరూప శివుడు నొకటే తత్త్వ మనెడి రాద్ధాంతము.

"విశిష్టశ్చ విశిష్టశ్చ - విశిష్టౌ (శివౌ) తయోరద్వైతం" అనిగాని, "విశిష్టంచ విశిష్టంచ - విశిష్టే (లింగే) తయో రద్వైతం" అనిగాని వ్యుత్పత్తిని నిర్ణయించిరి. అనగా పుం లింగ శివపదమును గాని, నపుంసక లింగ శబ్దమును గాని పురస్కరించుకొని విశిష్టయోరద్వైతమ్ అనెడి షష్ఠీసమాసమును తెలియవలెనని భావము.

ఇట్టి నిర్ణయమే వైష్ణవుల విశిష్టాద్వైతపు శైలియునై యున్నది.

శ్రీమన్నీలకంఠ శివాద్వైత సంప్రదాయమున స్మార్తశైవ మనెడి శ్రీ దీక్షితపథ మొకటియు, నిగమాగమశైవ మనెడి శివయోగి పథ మొకటియు అహాత్య రెండు శాఖలు కనబడుచున్నవి.

"శాఖాభేదో భవేన్మాత్రం సంప్రదాయో నభిద్యతే"
అనెడి అభియుక్తోక్తి ననుసరించి యీ రెండు శాఖలకు సంప్రదాయ మొక్కటియే. సాధకుల యభిరుచి ననుసరించి యీ ద్వివిధపథములో నన్యతరము గృహీతమగును.

శ్రీ కుమారిలభట్టు బుద్ధగురువుల యొద్ద విద్య నభ్యసించి తదుపరి బుద్ధ సంప్రదాయమును విమర్శించి, నిరసించి, నిర్దుష్టమైన వైదిక పథమును ప్రచారించి యుండినట్లే శ్రీ నాగలింగశాస్త్రిపాదులు స్మార్తశైవు లగు శ్రీ శ్రీనివాసశాస్త్రిగారివలన శ్రీకంఠ విద్యను బడసినవారై స్మార్త శివాద్వైత దోషోద్ఘాటనమునకుగానే శ్రీ శివచింతామణిప్రభను శివానుగ్రహమున వెలయించిరి.

ఏతదనుసారముగనే శ్రీ నిర్మల శంకరశాస్త్రిపాదుల యాంధ్రానువాద మన్యూనాతిరిక్తముగ నిర్వహింపఁబడినది.

ఇట్టి నిగమాగమ శివాద్వైత పథికులలో సంస్కృత భాషాస్వాతంత్ర్యము లేని జిజ్ఞాసు జనులు ఈ నిర్మల శైవసంప్రదాయబోధ నే తద్గ్రంథ మూలమున చక్కగా గ్రహించి ధన్యులు కాగల రనుట సువేద్యమై యున్నది.

నిర్మల శైవసంప్రదాయ మనుటలో నా యభిసంధి యేదన - శ్రీ దీక్షిత శివాద్వైత శాఖను "అంతఃశాక్తం బహిఃశైవం - సభామధ్యే చ వైష్ణవమ్" అనిర్మలమైన మిశ్రమార్గముగా చంద్రజ్ఞానము నిర్ణయించినదని శివయోగి సంప్రదాయ రహస్యమును సూచించుటయే.

ఇందువలన మన శ్రౌత శివాద్వైతులు, స్మార్త శివాద్వైత ప్రవణతను చెందకుందురు గాక యనెడి హెచ్చరిక వెల్లడింపఁబడుచున్నది కదా!

**మహేశ్వరమాహేశ్వర పాదసేవాపరాయణుఁడు**

*ఇవటూరి సానందారాధ్యులు*

**పమిడిముక్కల అగ్రహారము,**

**ప్రస్తుతనివాసము - మచిలీపట్టణము, కృష్ణామండలము.**

శివభక్తిధుర్యా! శంకరశాస్త్రివర్యా!

శ్రీకంఠాపరనామక నీలకంఠాచార్యులవారిచే రచింపఁబడిన బ్రహ్మసూత్రభాష్యమును సొంతముగా తామాంధ్రీకరింప సమకట్టి చతుఃసూత్రి వరకు నాకిడిన యనువాదగ్రంథమును సాకల్యముగా పఠించితిని.

భాష్యకారులు వ్రాసిన భాష్యపంక్తులయందు గల యర్థము నెల్ల జాతకులకు సుబోధకమగునట్లు దమ యాంధ్రానువాద మలరారుచున్నదని విజ్ఞులగువారు గ్రహింపకపోరు. ఒక భాషలోని భావములను మరియొకభాషలోనికి యథాస్థితి ననువదించుట సులభకార్య మెంతమాత్రమును కాదు. అందునను గీర్వాణభాషాగ్రంథముల ననువదించుట కడుంగడు దుస్తరము. ఇట్టి దుస్తర కార్యమునకు గడంగి తాము కృతకృత్యులైనట్లు నే నభిప్రాయపడితిని. మీ యాంధ్రానువాదముచే తమకు సంస్కృతభాషయందు గల యభినివేశమును, అందునను కావ్యగ్రంథముగాక దుర్గ్రాహ్యములగు తత్త్వార్థములచే విరాజిల్లు భాష్యార్థము ననువాదము చేయునట్టి యమేయమగు తమ విశాలబుద్ధి నైపుణ్యమును తమ యనువాదగ్రంథము చెప్పక చెప్పుచున్నది.

శ్రీ శాంకరభాష్యముగాని శ్రీ రామానుజీయ శ్రీభాష్యముగాని శ్రీ మధ్వాచార్యభాష్యముగాని శ్రీ శ్రీపతి పండితయతీంద్రరచిత శ్రీకర భాష్యముగాని బ్రహ్మసూత్రార్థమును సరిగా నిర్ణయింపజాలవనియు శ్రీ శ్రీకంఠాచార్యకృతభాష్య మొక్కటే సరియైన సూత్రార్థనిర్ణయమును చేసినట్లు నేననేకపండితాగ్రగణ్యులు చెప్పగా వినియున్నాను.

శ్రీ నీలకంఠారాధ్యులవారు ప్రతి సందర్భమునందును శ్రుతివాక్యముల నుదాహరించి సూత్రార్థమును ప్రతిపాదించినందునను యుక్త్యాభాసములను చూపనందునను శ్రీకంఠభాష్యమే సర్వభాష్యమూర్ధన్య మనుటలో నావంత యైనను సందియము లేదు.

సంకీర్ణయుగమగు నీ కలికాలమున సదర్థప్రబోధకములగు శ్రుతివాక్యములను నిరాకరించుచు జనులు అపమార్గమున ప్రవర్తించుటకు కారణము తత్తన్మతాచార్యులే యని స్ఫురించకపోదు. భూమిపై గల సర్వమతపండితులు స్వమతాభిమానము నుపేక్షించి సత్యాన్వేషణబుద్ధితో సర్వశ్రుతిప్రమాణప్రమిత మగు సిద్ధాంత మెయ్యదియని విచారించుచో వారందరు నీలకంఠభాష్యగత సిద్ధాంతమునకు రావలసినదే.

కేవలబుద్ధిబలముచే తత్త్వాన్వేషణను చేయునెడ బుద్ధులనవస్థాదూషితము లగుటచే బౌద్ధజైనచార్వాకాది మతములు నింద్యము లయ్యెను. శుష్క మతాభిమానమువలననే మతకల్లోలములు రాక తప్పవు.

శ్రీ మహోపాధ్యాయ యోగి శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారి శివచింతామణి ప్రథను తమరు సరిగ గ్రహించి తదనుసారముగ చతుః

సూత్రీవరకు చేయఁబడిన తమ యాంధ్రానువాదము మందబుద్ధులయొక్క అజ్ఞానాంధకారమును పోగొట్టుటకు దీపికవలె ప్రకాశించుచున్న దగుటచే సర్వతోముఖమగు తమ బుద్ధిబలమును పాండిత్యప్రతిభను మిక్కిలి కొనియాడు చున్నాను.

తక్కిన శ్రీకంఠభాష్యమును సమగ్రముగా ననువదించుటకు చిరాయు రారోగ్యములను మీకు పరమశివుఁడు ప్రసాదించుఁగాక యని శుభాశీర్వచన పూర్వకముగా నా యభిప్రాయమును తమకు సమర్పించుకొనుచున్నది.

శ్రీ నీలకంఠభాష్య ప్రవచన విశారదులగు
బ్ర. శ్రీ. నిర్మలశంకరశాస్త్రివర్యులకు
బ్ర. శ్రీ. ఇవటూరి సోమశేఖరారాధ్యులవారిచే
సమర్పింపఁబడిన
ప్రశంసాపద్యపుష్పమాల

నిర్మల నీలకంఠబుధ నిర్మిత భాష్యగతార్థ తత్త్వపున్
మర్మములం గ్రహించి యనుమాన మొకింతయు లేక లోకనిం
గూర్మిధరించి యాంధ్రమున గ్రొత్తగ మీరనువాద గ్రంథమున్
నిర్మలబుద్ధి వ్రాసితిరి నిర్మల శంకరశాస్త్రి సత్తమా !
అంతయు మిథ్య యీ జగము దక్కదె బ్రహ్మము సత్యమన్న రా
ద్ధాంత మబద్ధ మంచు నిజ తత్త్వవిచారణ నీలకంఠ సి
ద్ధాంతమె సత్యమంచు శ్రుతి తత్పరతన్ గ్రహియించి దాని నా
సాంతము దెన్గు జేసితివి శంకరశాస్త్రి ! నిశాతబుద్ధిచేన్.
ద్వైతమబద్ధ మంచు పడివాదన జేసి యసత్యమైన య
ద్వైతమె సత్యమన్న ఘనవాదుల నెల్ల జయింపగా శివా
ద్వైతము బుట్టెనంచు శివ తత్త్వవివేకము బోధసేయగా
భూతలమందు బుట్టితివి పుణ్యుడవై పరమేశు ప్రేరణన్.
నిర్మలనీతి వర్తనము నిర్మలబుద్ధి వివేకముం గడున్
నిర్మలమైన కీర్తి బహు నిర్మలమైన గుణవ్రజంబునున్
నిర్మల భోగభాగ్యములు నిన్ను వరింపగ శాస్త్రివర్య ! నీ
నిర్మల వంశమెల్ల గడు నిర్మలమయ్యె త్వదీయ జన్మచేన్.

అన్నపూర్ణాంబికం సన్నుతాంగిన యేరి
తల్లియై వర్ధిల్లె ధరణియందు
కాశీనాథాహ్వయ ప్రేమపాత్రులు నేరి
తండ్రియై వెలుగొందు ధాత్రియందు
శ్రీనుతాంబయ నామ సిద్ధాంతి యెవ్వరి
కన్నయై జగమందు వన్నెకెక్కె
విశ్వనాథాహ్వయ వినుత శాస్త్రజ్ఞాని
యేరికి తమ్ముడై పేరుపొంద
నిర్మలగ్రామ మేరికి నిలయమయ్యె
వట్టి శంకరశాస్త్రి విద్యాఘనుండు
జ్ఞానభాస్కరుడగుచు నజ్ఞానతిమిర
మడచుగాన్పించు శివభక్తి నధిపుడగుచు.

★

## శ్రీ శివయోగి నాగలింగారాధ్యకృత దక్షిణామూర్తి స్తోత్రము
### (శ్రీ నిర్మల శంకరశాస్త్రి విరచిత ఆంధ్రాభిప్రాయముతో సహ)

పరమేశ్వరుఁడు స్వావినాభూతశక్తివిశిష్టుఁడని ప్రతిపాదించుచున్నవారు.

శ్లో. శక్త్యా య శ్చిదచిద్విశేషయుతయా యుక్తో జగద్రూపయా
జ్ఞానేచ్ఛాకృతిరూపయా సహజయా సంతిష్ఠతే కేవలః
జన్మాదీని కరోతి పంచ జగతః కృత్యాని యో లీలయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే. ౧

చిత్ (జీవుఁడు) అచిత్ (మాయ) భేదముతో కూడినదియు, ప్రపంచ స్వరూపము గలదియు ఇచ్ఛాజ్ఞానక్రియ లనఁబడు త్రివిధరూపములు గలదియు తనతోఁడ ననాదికాలమునుండి వ్యక్తమగుచున్నదియు నగు శక్తితో కూడి యుండువాఁడును; సమానుఁడైన రెండవ యధిష్ఠాత లేనివాఁడును; జగముఁ జెందియుండు సృష్టిస్థితిలయ తిరోధాన అనుగ్రహము లనఁబడు పంచకృత్యములు నవలీలగా గావించుచు విరాజిల్లువాఁడును, మహాదేశికుఁడును లోక వేదములందు సుప్రసిద్ధుఁడు నగు శ్రీ మేధా దక్షిణామూర్తిదైవమునకు—వినయపూర్ణంబగు మనసునందున్న నమ్రభావము (నమస్కారము) ను సమర్పించుచున్నాను.

పరాత్పరుఁడే కార్యకారణస్వరూపుఁడని తెలుపుచున్నవారు.

* సర్వావస్థ జగచ్ఛరీరకతయా య స్తత్ప్రకారః పరః
సూక్ష్మస్థూల దశా విశేషిత జగద్రూపేణ విద్యోతతే
ఇత్యాభేదయితుం వదంతి నిగమాః కార్యంచ యం కారణం
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే. ౨

సర్వాతీతుఁడైన మహేశ్వరుఁడు—సర్వవిధ పరివర్తనములుగల జగము శరీరముగా గలవాఁడగుటచే జగద్గత భేదములను చెందియుండువాఁడై సూక్ష్మ స్థూలదశలతో ద్వివిధంబగు ప్రపంచముగా ప్రకాశించుచున్నవాఁడు— అని తెలుపుటకు వేదములచే కార్యముగాను కారణముగాను చెప్పఁబడునట్టి మహా దేశికుండైన సుప్రసిద్ధ శ్రీ మేధా దక్షిణామూర్తికి (ఈ) నమస్కారమును సమర్పించువాఁడను.

జగజ్జీవేశ్వర భేదమును తదభేదమును నిర్దేశించుచున్నవారు.

* యత్రాంతర్గణికం విశేష మితరే కైవల్య మేవాంతతః
మన్వానా వివదంతి ముఖ్య మపరే దేవే విశిష్టే శ్రుతమ్
ఐక్యం యస్య చ యద్విశేషణగతం భేదం బ్రవీతి శ్రుతి
స్తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే. ౩

శక్తివిశిష్టుడగు పరమాత్మయందు— కొందరు అంతర్గత భేదమును అనగా తారతమ్యముతో కూడిన ముక్తజీవ ముక్తిసంభావనను, మరికొందరు ప్రారబ్ధాంతమందు బంధనివృత్తి ద్వారా సంభవించు స్థితిని నామరూపగుణ రహితమైన వస్తుమాత్రముగాను చెప్పుచు వాదించుకొనుచుందురు. కాని వస్తుతః విశేషణగతముగా భేదమును విశేష్యగతముగా నభేదమును ఏ పరాత్పరుని విషయమై శ్రుతి ప్రతిపాదించుచున్నదో అట్టి శ్రీ మేధా దక్షిణామూర్తికి నమస్కారము.

విశేషణగత భేదమును విశేష్య నిరూపణను చేయుచున్నవారు.

* బహ్వ్యో యన్నిగమసూక్తయ శ్చిదచితో రీశస్య యస్యైవ చ
భోక్తృత్వేన చ భోగ్యభావవశత స్తత్ప్రేరకత్వా దపి
వైలక్షణ్య మవార్యమేవ సహజం సంచక్షతే సాదరం
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే. ౪

జీవజగములు పరమేశ్వరునకు విశేషణము లనబడును. జీవుడు సుఖదుఃఖాత్మకమగు ప్రకృతి ననుభవించువాడనియు, ప్రకృతి భోగ్యంబనియు జీవజగములను ప్రేరేపించువాడు పరమాత్మ యనియు ఎవ్వానివిషయమై శ్రుతిసూక్తములు— జగజ్జీవేశ్వరులలో విలక్షణభావము అనివార్యమై సహజమగునని వక్కాణించుచున్నవో అట్టి విశేషణవిశిష్టుడగు శ్రీ మేధా దక్షిణామూర్తికి నమస్కారము.

ప్రేరకత్వమును వివరించుచున్నవారు.

* శాస్తేఽంతః సమనుప్రవిశ్య సతతం య శ్చేతనాచేతనౌ
తౌ యస్యైవ నియమ్యభావవశత స్తన్వా వువాచ శ్రుతిః
ఏవం య శ్చిదచిద్విభాగకలనోదంచ జ్జగద్విగ్రహ
స్తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే. ౫

పరమేశ్వరునిచే లోనఁ బ్రవేశించి శాసింపఁబడు చేతనాచేతనములు పరమేశ్వరునికి శరీరములు గావున నియమింపఁబడుచుండునని వేదముచే బోధింపఁబడుటఁజేసి చిదచిద్విభాగముగల ప్రపంచము స్వరూపముగా గలిగి యుండువాడగు శ్రీ మేధా దక్షిణామూర్తికి నమస్కారము.

నిర్గుణతను సగుణత్వమును సమర్థించుచున్నవారు,

* సార్వజ్ఞ్యప్రముఖం శుభం గుణగణం బ్రూతే గుణిత్వార్థికా
క్షుత్తృష్ణాది మభవ్య మేవ నుదతే కించాగుణత్వార్థికా
యస్యైవో భయలింగతాం పశుపతే ర్వక్తుం ప్రవృత్తా శ్రుతి
స్తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే. ౬

గుణిత్వమును తెలుపు శ్రుతి—మంగళకరముగు సర్వజ్ఞతాది గుణసము దాయము కలవాడని చెప్పునది. నిర్గుణతను ప్రతిపాదించు శ్రుతి— ప్రాకృతములైన క్షుత్పిపాసాది గుణములు లేనివాడని నిరూపించునది. ఇట్లు సగుణ నిర్గుణత్వముల రెంటియొక్క నిర్వచనముకొరకు ఏ పరమాత్మవిషయమై నిగమములుప్రవర్తించినవో అట్టి శ్రీ మేధాదక్షిణామూర్తికి నమస్కారము.

అద్వైతభావనా పరమార్థమును విశదీకరించుచున్నవారు.

* తాదాత్మ్యం తదసీతి బోధయతి యస్యైకస్య శిష్యం గురుః
బ్రహ్మాస్మీతి విభావ్య యాతి య మనన్యేనైవ భావేన సః
పత్యు ర్యస్య పశో రుపాసనవిధా ఽద్వైత మాహ శ్రుతి
స్తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే. ౭

ఓ శిష్యుడా ! నీవు ఆ పరమాత్మ యంతర్యామిగా కలవాడవని "తత్త్వమసి" మహావాక్యముతో గురువు బోధించును. శిష్యుఁడు గురు ప్రబుద్ధుడై నేను బ్రహ్మనగుచున్నానని "సోఽహం" భావనతో అనన్యమన స్కుడై పరమేశ్వరుని పొందుచున్నవాడు. ఇట్లు జీవుఁడు పరమేశ్వరు నుపా సించునపుడు— గరుత్మన్మంత్రోపాసకుఁడు గరుత్మంతునితో నభిన్నుడుగా కనఁబడునట్లు— శివాద్వైతభావనను కలిగియుండవలెనని శ్రుతి "నారుద్రో రుద్ర మర్చయేత్" అని యెవ్వాని నారాధించుటను గురించి చెప్పుచున్నదో అట్టి శ్రీ మేధా దక్షిణామూర్తికి నమస్కారము.

శ్రీ దక్షిణామూర్తి జ్ఞానముద్రాధారి యగుటను ప్రతిపాదించుచున్నవారు.

* ప్రాణి న్మే తను రస్యథాపి నతు మాం వేత్సి త్వదంతః స్థితం
మాం జానాసి నియామకం యది తదా మృత్యోర్విముక్తో న్మోచ్యసె
ఇత్యర్థం ప్రకటీకరోతి సదయో యశ్చారు చిన్ముద్రయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే. ౮

ఓ జీవుడా ? నీవు నా శరీరమైయుండియు నన్ను నీలో నుండువానిగా గురుతెఱిగకున్నావు. ఎప్పుడు నన్ను ప్రేరకునిగా నెఱుంగుదువో అప్పుడు సంసారమునుండి విడిబడుదువు. ఇట్లు మనోహరమైన తన చిన్ముద్రతో దయ గలవాడై (పై యంశమును) విశదీకరించునట్టి శ్రీ మేధా దక్షిణామూర్తికి నమస్కారము.

నిర్విశేషత్వమును చెప్పుటకు గల హేతువు నుదాహరించి సవిశేషతను చెప్పు చున్నవారు.

* సంచింత్యాపి విశిష్య వక్తు మనలం ధీవాగమేయాత్మకం
చాచార్యా విఫలోద్యమా య మవిశేషం సంగిరంతే పరే
శేషో యస్య చ శేషిణ శ్చిదచిదాకారః ప్రపంచోఽఖిల
స్తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే. ౯

కొందరు ఆచార్యులు— అవాఙ్మానసగోచరుండగు పరమాత్మంగూర్చి మిక్కిలి విచారించియు "ఇదమిత్థమని" నిర్దేశించి వక్కాణింప నలవిగాకుండు టచే తమ యుద్యమము కొనసాగనందున నిర్విశేషముగా చెప్పుచున్నవారు. కానియథార్థవిషయ మేమనగా ? శేషియగు ఏ భగవంతునికి చిదచిత్సమరసీ భూతమగు ప్రపంచము శేషంబగుచున్నదో అట్టి సవిశేషుండగు శ్రీ మేధా దక్షిణామూర్తికి నమస్కారము.

మహోపనిషదమునందలి ముఖ్యాంశమును వివరించుచున్నవారు.

* బ్రహ్మేంద్రా న విదేదతు ర్న వదితుం వేదోఽపి వేదైవ యం
వేదాహం త్వితి యం బ్రవీతి పిం జగత్యేకః స నారాయణః
భక్త్యా వేత్తి ముకృత్యనన్యగతయా యం యత్ప్రపిండా త్తయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే. ౧౦.

శ్రీ దక్షిణామూర్తిని బ్రహ్మేంద్రాది దేవతలు వేదంబును నిర్వచించు టకు సమర్థులగువారుకారు. ప్రపంచమున శ్రీమన్నారాయణుం డొక్కడే "శివోఽహం" భావనగలవాడై నేను శివుని గుర్తెరుగుదునని చెప్పుచున్నవాడు.

ఇట్లు నారాయణుఁడు ఏ పరమాత్మ యనుగ్రహము వలన సమస్త వాఙ్మయప్రసిద్ధంబగు అనన్యభక్తితో పరమేశ్వరుని బాహ్యాభ్యంతరములందు కనుగొనుచు సుకృతియనఁబఱగుచున్నవాఁడో అట్టి శ్రీ మేధాదక్షిణామూర్తికి నమస్కారము.

శ్రీ దక్షిణామూర్తి మౌనముద్రఁదాల్చుటకు భిక్షాటనలీలను చూపుటకును గల యుపపత్తి నుదాహరించినవారు.

* వాణీ వారిజసంభవస్య రమణీ త్యాసేవి మౌనవ్రతం
లక్ష్మీః పంకజచక్షుషః ప్రియతమే త్యామోది భిక్షాటనమ్
యేనామ్నాయకృతా స్వసేవకవధూసంభోగబీభత్సయా
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే. ౧౧

చతుర్ముఖుని సహధర్మచారిణియని సరస్వతి నుపయోగింపక మౌన వ్రతము నవలంబించినవారు. నారాయణుని యర్ధాంగియని లక్ష్మీదేవికి నాశ్రయంబీయక భిక్షాటనము నాచరించినవారు. వేదములను తన నిట్టూర్పుగా బయలుపఱచిన ఏ పరమాత్మ తన యనుచరుల వనితల ననుభవించు బీభత్సమునకు విసుగుఁజెంది మౌనముద్ర భిక్షాటన లీలయు కలవాఁడో అట్టి శ్రీ మేధా దక్షిణామూర్తికి నమస్కారము.

వేదశివాగమములుదక్క దర్శనములన్నియు పరమేశ్వరస్వరూపమును నివేదింప నశక్యంబులని వివరించుచున్నవారు.

* యస్యైశ్వర్య మతర్క్య మూహితు ముపక్రమ్య భ్రమా దన్యథై
వాన్యోన్యం బహు విబ్రువణ మునిగణః సంవ్యాహతార్థావిలైః
స్వాజ్ఞానం వివరీవరీతి సుఘనం స్వైరై రహో దర్శనై
స్తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే. ౧౨

తర్కింపనశక్యమగు శ్రీ పరమేశ్వరుని యైశ్వర్యమును గురించి పరామర్శించుటకు ప్రారంభించి భ్రాంతివలన నయథార్థముగా పరస్పరము వాదించుకొను మునిగణము సంకుచితార్థములతో కలుషితంబులగు తమ దర్శనము (శాస్త్రము) లతో - మిక్కిలి పాదుకొనిన తమ యజ్ఞానమును వెల్లిఁబఱచినవారు. (ఆశ్చర్యము !) అట్టి యతర్క్య మహిమాన్వితుఁడగు శ్రీ మేధా దక్షిణామూర్తికి నమస్కారము.

